శీతంశాంతే దుర్బలాశ్వేగ
జేచబలవర్జితే।

శీత-న-ఇది- శాంతమునకును- బలములేని గుఱ్ఱమునకును-ఆఱ్ఱియేనుగునకును పేరు.

సుత స్త్వభిషుతేపుత్రేస్యాం
సుతానాత్వాస్నజేనృపే॥

సుత-ఇది-యజ్ఞమునందు సోమలతలందిండినవానికి పేరయినప్పుడు-పు కొమారితెకు పేరగునప్పుడు. స్త్రీ- ఉ[illegible]నకును. రాజునకును పేరయినప్పుడు షు.

పిత్రోః ప్రసూతేకసూత
స్స్యాత్సుతాతక్ష్ణిసారథౌ
క్షత్రాద్విప్రాసుతే వ్యాసశి
ష్యేపారదవందినోః।

సూత-పు ఇది-తల్లిదండ్రుల కును కరుటకును- వడ్లవానికిని-సారథికిని-రాజువలన బ్రాహ్మణస్త్రీకిబుట్టినవానికిని.వ్యాసశిష్యునకును- పాదరసమునకును- భట్టువానికిని పేరు.

సుప్తైస్తంపశ్చి మాద్రౌతు
పుంసి

అస్త-ఇది-నిదురబోయినవానికి పేరయినప్పుడు-న-పశ్చిమాద్రికి పేరయినప్పుడు-పు.

శస్తంతునిద్రుకే। క్లీబంక్షేమే

శస్త-న।ఇది-ప్రసిద్ధమునకును క్షేమమునకును పేరు.

భక్తంస్యాత్సతత్వారేన్నే
మునద్వయోః।౧౯౦॥

భక్త-న।ఇది-సేవకుడు-అన్నమునకును పేరు.

వృత్తంస్యాద్వర్తులాతీత
దృఢేషుత్రిషునద్వయోః।
స్వరూపేచరితేపద్యే జవనే
వర్తనేపిచ।౧౯౧।

వృత్త-ఇది వట్రువయినదానికిని- గడచినదానికిని- బటువయినదానికిని పేరయినపుడు. త్రి- స్వరూపమునకును చారిత్రమునకును-పద్యమునకును- వేగమునకును- జీవనోపాయమునకును పేరయినపుడు-న.

ఉక్తంప్రోక్తేనద్వయోస్తు
ఛందోభేదేపిభాషణే।

ఉక్త-న।ఇద-చెప్పబడినదానికిని మొదటిచందస్సునకును-మాటకును పేరు.

వ్యక్తంస్పష్టేనాతు బుధే

వ్యక్త ఇది-స్పష్టమైనదానికిని పేరగునపుడు-న- పండితునకు పేరయినపుడు-పు.

తిక్తస్తురసభేదవాక్।౧౯౨

తిక్త-ఇది-చేదుగలదానికిపేరయినపుడు-పు- కటికరోహిణికిపేరయినపుడు- స్త్రీ-సుగంధమునకును- రుచికిని పేరగునపుడు పు.

తిక్తాస్త్రీకటురోహిణ్యాంసు
గంధరసయోస్తు నా।

రక్తానురక్తేనీల్యాది రంజి
తేలోహితేపిన।౧౯౩। నక్లీ
బనాకుంకుమాస్కృక్తా [illegible]
షుస్వేనద్వయోః।

రక్త-ఇది- ప్రేమగలవానికిని- నీలిమొదలయినచాయచేయబడినదానికిని. ఎఱుపుగలదానికిని- ఎఱుపునకును పేరయినపుడు-త్రి-కుంకుమకును-నెత్తురునకును- రాగికిని పేరయినపుడు-న.

ముక్తోమోక్షేముక్తస్స్యాత్ప్ర
త్యాముక్తాఫలేస్త్రియాం।
కాంతంహారాస్త్రీకుయో
షిత్ప్రియంగా పుపలేపనా।

ముక్త ఇది విడువబడినవానికిని అపిశబ్దమువలనముక్తునకును పేరైనపుడు పు ముక్తికిని- ముత్యమునకును పేరైనపుడు-స్త్రీ.

కాంత ఇది-అందమైనదానికి పేరైనపుడు-న స్త్రీకి పేరైనపుడు స్త్రీ. [illegible] కును- ముండంటురాతికిని అపిశబ్దమువలన [illegible] కును పేరయినపుడు-పు.

క్లీబేరతంగుహ్యరతయోః
క్లీబమాజ్యంబునోఘృ
తమ్। ౧౯౪।

రత-న।ఇద-రహస్యమునకును-రతకిని పేరు.

ఘృత-న।ఇద- నేతికిని-నీళ్ల కును పేరు.

పూతాదీనాం ప్రయోగ [illegible] ం- పూతశబ్దము

స్కందో గుహే నదీకూలే

స్కంద-పు॥ ఇది-కుమారస్వామికిని- నదియొక్క గట్టునకును పేరు.

సాదిస్స్యాద్రోహసూతయోః।

సాదిన్-పు॥ ఇది- గుఱ్ఱపురౌతునకును- సారథికిని పేరు.

పాదుకోపానహౌః పాదూ

పాదూ-స్త్రీ॥ ఇది- చెప్పునకును- పావుకోళ్ళకును పేరు.

ఛర్దిర్వమనరేతసోః॥

ఛర్ది-స్త్రీ॥ ఇది- కక్కుటకును- రేతస్సునకును పేరు.

పాదభూషా శృంఖలయో రదుస్త్రియ

అదు-స్త్రీ॥ ఇది-అందె మొదలయిన పాదాభరణములకును- ఏనుగుల గట్టుగొలుసునకును పేరు.

అమీస్త్రియః।

అమీ- ఈ పాదూ- ఛర్ది- అదుశబ్దములు 3ను స్త్రియః- స్త్రీలింగములుగలవి.

పదవ్యాజాంఘ్రి తచ్చిహ్నస్థానత్రాణాంకులత్సు స॥ ౭౧-౨ వ్యవసాయే సుప్తిఙ్ఘోషాయకే వస్తువాక్యయోః।

పద-న॥ ఇది- స్వార్థము యొకదానిని ఉద్దేశించిన ఆ యొకదాని చేయుటకును- పాదమునకును- అడుగుజాడకును- స్థానమునకును- రక్షించుటకును- కరణమునకును- ఆడియాలమునకును- ఉద్యోగమునకును సుబంత తిజంత సమూహమునకును- బాణమునకును- వస్తువునకును- వాక్యమునకును పేరు.

ఛందాంసి త్రిష్టుబాదీని శ్రుతీచ్ఛామనయోరపి॥ ౭౧.౩॥

ఛందస్-న॥ ఇది- త్రిష్టుప్పు మొదలగు ఛందస్సులకును- వేదమునకును- యిచ్ఛకును- ఊరడించుటకును పేరు.

నదస్సముద్రే నినదే సరిజ్జ్ఞేద

నద-పు॥ ఇది- సముద్రమునకును- ధ్వనికిని- పడమరగా పారు నదికిని పేరు.

నదీసరిత్।

నదీ-స్త్రీ॥ ఇది నదికి పేరు.

గదో రోగహరిభ్రాత్రో ర్గదాస్యాదాయుధాంతరే॥

గద- ఇది- రోగమునకును- శ్రీకృష్ణునితమ్మునికిని పేరైనపుడు॥ పు॥ ఆయుధవిశేషమునకు పేరగునపుడు॥ స్త్రీ॥

కుందం మాఘ్యే చ కుందో నానిధిభేదమురద్విషోః।

కుంద- ఇది- మొల్లపూవునకు పేరగునపుడు॥ న॥ నిధికిని- విష్ణువునకును పేరగునపుడు పు॥

మందః పుంసి రవేస్సూనౌ గజభేదేత్వయం త్రిషు॥ ఖలమూర్ఖ జడస్వైర స్వల్పనిర్భాగ్యరోగిషు।

మంద- ఇది- శనైశ్చరునకు పేరైనపుడు॥ పు॥ మందజాతియేనుగునకును- కొండెగానికిని- మూర్ఖునకును- వివేకహీనునకును- స్వేచ్ఛకును- కొంచెమునకును- నిర్భాగ్యునకును- రోగికిని పేరయినపుడు॥ త్రి॥

మృదుస్సుష్ఠ్వపి

మృదు- త్రి॥ ఇది- వాడిలేనిదానికిని- అపిశబ్దమువలన మెత్తనిదానికిని పేరు.

మధురం మృష్టస్వాద్వోస్స్వాద్వపి పాత్రిషు॥ ౭౧-౪॥

స్వాదు- త్రి॥ ఇది- మధురమయినదానికిని- రుచిగలదానికిని పేరు.

ఈ మృదు స్వాదుశబ్దములు రెండును త్రిలింగములుగలవి.

ఇతి ధాంతాః.

—※ ఇతి ధాంత పదవర్గము ముగిసెను. ※—

బుధస్సూరౌ సురే సౌమ్యే

బుధ-పు-ఇది- పండితునకును- దేవతకును- బుధునకును పేరు.

వేధా విష్ణౌ విధాతరి।

వేధస్- పు॥ ఇది- విష్ణువునకును బ్రహ్మకును పేరు.

విధుస్స్యాదాకాశే కాలే విష్ణౌ
వాతేఽగ్నిరక్షసోః ॥ ౧౦౭॥

విధు-పు॥ ఇది- చంద్రునకును- కాలమునకును- విష్ణువునకును- వాయువునకును- అగ్నికిని- రాక్షసునికిని పేరు.

విధిస్త్వవధానే నియతౌ కాలే ...వే

విధి-పు॥ ఇది- చేయుటకును- దైవమునకును- కాలమునకును- బ్రహ్మకును- ఆపిశబ్దమువలన ప్రకాశమునకును- విధాయకవాక్యమునకును పేరు.

స్యాధిరధిష్ఠానే చిత్తరుజః
ఖేన్యాసనే బంధనేపి చ ॥ ౧౦౮॥
అధి

అధి-పు॥ ఇది- ఒకదానికి నాధారమైనదానికిని- మనోవ్యాధికిని- వ్యసనమునకును- బంధనమునకును పేరు.

ర్బోధిస్సమాధౌ చ కుక్కు-
టాశ్వత్థబుద్ధిషు।

బోధి- ఇది- సమాధికిని - కోడికిని- రాగిచెట్టునకును- బుద్ధికిని పేరు.

అబ్ధిస్సరస్సంతౌ.

అబ్ధి పు॥ ఇది- కొలనికిని- సముద్రమునకును పేరు.

బంధుర్బంధూక బాంధవౌ।

బంధు పు॥ ఇది- మంకెనచెట్టునకును- బంధువునకును పేరు.

గంధోగంధక సంబంధా
మోదలేశస్మయేషు చ।

గంధ-పు॥ ఇది- గంధకమునకును- సంబంధమునకును- పరిమళమునకును- లేశమునకును- గర్వమునకును పేరు.

స్కంధో దేహ విభాగేంసే
ప్రకాండే సంహతౌ నృపే॥

స్కంధ-పు॥ ఇది- బౌద్ధశాస్త్రమున జెప్పినరూపవేదనావిజ్ఞానసంజ్ఞాసంస్కారములను పంచస్కంధములకును- మూపునకును- వేళ్ళు మొదలుకొని కొమ్మలవరకుగల చెట్టుయొక్క మధ్యభాగమునకును- గుంపునకును- రాజునకును పే

విధావిధానేహ స్త్యన్నే
ప్రకారే వేతనేపి చ।

విధా-స్త్రీ॥ ఇది- చేయుటకును- గజాన్నమునకును ప్రకారమునకును- కూలికిని పేరు.

సుధామృతం లేపభేదే స్నూ
ర్వాసర్పాశనస్నుహీ।

సుధా-స్త్రీ॥ ఇది- అమృతమునకును- సున్నపుపూతకును- చాగకును- సర్పాశనమునకును- జెముడుచెట్టునకును పేరు.

వధూర్నవోఢా స్నుషయో
ర్భార్యా స్త్రీ శారిబాసు చ।

వధూ-స్త్రీ॥ ఇది- నూతనముగ వివాహము చేయబడిన పెండ్లికూతునకును కోడలికిని- భార్యకును- స్త్రీకిని- సుగంధపాలతీగకును పేరు.

గోధా తలే నిహాకాయాం

గోధా-స్త్రీ॥ ఇది- వింటినారి దెబ్బ తగలకుండుటకై చేతగట్టుకొను తోలునకును- నీరుడుమునకును పేరు.

వృద్ధిర్మోద సుఖర్ద్ధిషు॥

ఋద్ధి-స్త్రీ॥ ఇది- సంతోషమునకును- సుఖమునకును- వృద్ధికిని పేరు.

సంధా వర్యౌ ప్రతిజ్ఞాయాం

సంధా-స్త్రీ॥ ఇది- మర్యాదకును- ప్రతిజ్ఞకును పేరు.

శ్రద్ధాత్వాస్తిక్య కాంక్షయోః।

శ్రద్ధా-స్త్రీ॥ ఇది- కలదనునమ్మకమునకును- ఇచ్ఛకును పేరు.

ఆలస్య నిద్రయోర్మిద్ధం
ఖండేర్ధోర్థం సమాంశే కే॥

మిద్ధ-న॥ ఇది- ఆలస్యమునకును- నిద్రకును పేరు.

అర్ధ- ఇది- ఖండమునకు పేరగునపుడు॥ పు॥ సమాంశమునకు పేరగునపుడు॥ న॥

చైత్రవసంతమధ్వు మహాద
... మధుః ...

మధు- ఇది- చైత్రమాసమునకును- వసంతఋతువునకును- ... పునకును- రాక్షసునకును పేరైనపుడు॥ పు॥ ...

జినావర్హత్తథాగతౌ।
జిన-పు॥ఇది- పూజ్యునకును- బుద్ధదేవునకును పేరు.

ఘృణౌ భానుశశాంకాదౌ
ఘృణి_పు॥ఇది- సూర్యునకును-చంద్రునకును పేరు.

భానూ కిరణ భాస్వతౌ
భాను-పు॥ఇది- కిరణమునకును-సూర్యునకును పేరు.

వహ్నిరక్ష్ణి హయే గ్నౌ చ
వహ్ని-పు॥ఇది కంటికిని-గుర్రమునకును అగ్నికిని పేరు.

మునిర్బుద్ధ ద్రుమర్షిషు
ముని- పు॥ఇది-బుద్ధదేవునకును- వృక్షవిశేషమునకు సుమునికిని పేరు.

బుధ్నశ్శిఫాయాం మూలేచ
బుధ్న-పు. ఇది- చెట్టుమొదలుకొని తుదవరకుబోయినతీగెకును (అనగా నూడ) చెట్టుమొదటికిని పేరు.

సూనుః పుత్రేనుజేరవౌ
సూను_పు॥ఇది-కుమారునకును- తమ్మునకును- సూర్యునకును పేరు.

నీనో మృగాంతరే తంతౌ
వ్రీహిభేదే శుకాంతరే।
నీన పు ఇది-మృగవిశేషమునకును- దారమునకును- ధాన్యభేదమునకును- చిలుకలలోనొక భేదమునకును పేరు.

స్వప్నస్సుప్తస్య ధీర్నిద్రా
స్వప్న-పు॥ఇది నిద్రపోయినవానిబుద్ధికిని-నిద్రకును పేరు.

మీనో రాశ్యంతరేపిచ।
మీన-పు॥ఇది-మీనరాశికిని- అపిశబ్దమువలన మత్స్యమునకును పేరు.

ధానా భ్రష్టయవే వృక్షబీ
జేస్యాద్ధాన్యకేపిచ। ౨౩౪॥
ధానా. స్త్రీ॥ఇది-బారుగులకును- వృక్షబీజమునకును- ధాన్యమునకును పేరు.

పరస్త్రీభార్యయోర్జాని
ర్జనిర్జన్మజనిస్స్నుషా।
జాని స్త్రీ॥ఇది- పరస్త్రీకిని- భార్యకును పేరు.
జని-ఇది- పుట్టుకకు పేరయినపుడు॥పు॥ కోడలికి పేరయినపుడు।స్త్రీ॥

జ్యోత్స్నీ పటోలికాసాచ
రాత్రిశ్చంద్రిక యాన్వితా॥
జ్యోత్స్నీ స్త్రీ॥ఇది-పొట్లతీగెకును-వెన్నలతోగూడిన రాత్రికిని పేరు.

జ్యోత్స్నాస చంద్రనక్షత్ర
రాత్రౌ చంద్రాతపేపిచ।
జ్యోత్స్నా-స్త్రీ॥ ఇది-చంద్రనక్షత్రములతోగూడిన రాత్రికిని- వెన్నెలకును పేరు.

రత్నంమణౌ చ శ్రేష్ఠేచ
రత్న-న॥ ఇది-మణికిని-శ్రేష్ఠునకును పేరు.

వనం కాననసీరయోః।
వన-న॥ఇది-అడవికిని- ఉదకమునకును పేరు.

గతివాహనయోర్యానం
యాన-న. ఇది- పోవుటకును-వాహనమునకును పేరు

పానం పీతౌ చ రక్షణే।
పాన-న। ఇది-త్రాగుటకును. రక్షించుటకును పేరు-

దానం గజమదే త్యాగే శు
ద్ధిఖండనయోరపి। ౨౩౭।
దాన న॥ఇది- ఏనుగుమదమునకును- త్యాగమునకును- పరిశుద్ధికిని-ఖండించుటకును పేరు.

అవకాశే స్థితౌ స్థానం
స్థాన న॥ఇది- తావునకును-ఉనికికిని పేరు.

స్థానేస్యాద్యుక్తమవ్యయం
స్థానే-అ॥ఇది-యుక్తమనుటకు పేరు.

చిహ్నం పుంశేఫతాకాయాం
చిహ్న- న॥ ఇది- గురుతునకును- టెక్కెమునకును పేరు.

ద్యుమ్నం విత్తే పరాక్రమే॥
ద్యుమ్న-న॥ఇది- ధనమునకును- పరాక్రమమునకు పేరు.

స్నానీయ సేకయోస్స్నానం
స్నాన-న॥ ఇది- స్నానయోగ్యవస్తువునకును- స్నానమునకును పేరు.

ఏనస్సాన్య స్నంతుకిల్బిషే।
ఇనో ఘూపేరవాపుంసి ధనిక
స్వామినో స్త్రిషు॥

ఏనస్-న॥ ఇది ఆపరాధమునకును-పాపమునకును పేరు॥
ఇన-ఇది- రాజునకును- సూర్యునకును పేరయినపుడు॥ పు॥ ధనికునకును-ప్రోపకునకు పేరయినపుడు॥ త్రి॥

యోనిర్ద్వయో ర్భగేస్థా
నేకారణా కారయోరపి।

యోని-స్త్రీ॥ ఇది- భగమునకును- స్థానమునకును- కారణమునకును-ఆకారమునకును పేరు॥

తను స్త్వక్కాయయోః
స్త్రీస్యా ద్విరళస్వల్పయో
స్త్రిషు।౨౪౦॥

తను-ఇది-చర్మమునకును- శరీరమునకును పేరగునపుడు॥ స్త్రీ॥ విరళమగుటకును- స్వల్పమునకును పేరగునపుడు॥ త్రి॥

కఠినాధికసాంద్రేషు వా
ద్యమ స్యసుస్వృత్తయోః। ము
స్తాముద్గరమూర్తేషు త్రిషు
మేఘే ప్రమాణే ఘనః।

ఘన ఇది- కఠినమయినదానికిని- అధికమయినదానికిని-దట్టమయినదానికిని- కాంస్య తాళమధ్యభాగమునకును- నృత్తమునకును-తుంగముస్తెకును-లోహపుగుదియకును కాఠిన్యమునకును పేరైనపుడు॥ త్రి॥ మేఘమునకును పేరగునపుడు॥ పు॥

హానం శుష్కే శుష్కఫలే
వనసంబంధిని ద్విషు। క్లీ చేత్వ
యసురంగాయాం సౌరభే
సేవనేగతౌ।౨౪౧॥

వాన- ఇది- ఎండినదానికిని- ఎండిన ఫలమునకును పేరగునపుడు॥ న॥ వనసంబంధియైనదానికి పేరగునపుడు॥ త్రి॥ సుగంగమునకును- పరిమళమునకును- కుట్టుటకును- పోవుటకును పేరగునపుడు॥ న॥

మానస్త్రీణాం కోపభే
దేగర్వేచిత్తోన్నతావపి। మా
నం ప్రమాణే ప్రస్థాదౌ

మాన- ఇది- స్త్రీలయొక్క కోపవిశేషమునకును-గర్వమునకును- నేనతిశయుండను చిత్తౌన్నత్యమునకును పేరగునపుడు॥ పు॥ ప్రమాణమునకును- మంత మొదలగుకొలుచు సాధనములకును పేరగునపుడు॥ న॥

భక్తేన్నం భక్షితే త్రిషు॥

అన్న- ఇది- అన్నమునకు పేరగునపుడు॥ న॥ భక్షింపబడినదానికి పేరైనపుడు॥ త్రి॥

నగ్నోవం దిక్షపణయోర
యం వివసనే త్రిషు।

నగ్న-ఇది-కనివానికిని-క్షపణకుండను జైనమతోద్ధారకునకును పేరగునపుడు॥ పు॥ వస్త్రహీనునకు పేరగునపుడు॥ త్రి॥

సూనం శూన్యే త్రిషు క్లీబే పు
ష్పే సూనాతు మేఖలా॥ ర
శ్మౌ సద్యాం వధస్థా నేరస
నాధస్త్న లేపిసా।

సూన- ఇది- శూన్యమయినదానికి పేరగునపుడు॥ త్రి॥ పుష్పమునకు పేరగునపుడు॥ న॥ మొలనూలునకును- కిరణమునకును- నదికిని-చంపునట్టిస్థలమునకును-నాలుకయడుగుననున్న కొండనాలుకకును పేరయినపుడు॥ స్త్రీ॥

స్యాచ్ఛన్నం రహసి క్లీబే
ఛాదితేతు త్రిలింగకం। ౨౪౨

ఛన్న- ఇది- రహస్యమునకు పేరగునపుడు॥ న॥ కప్పబడినదానికి పేరగునపుడు॥ త్రి॥

సన్నమల్పే విశీర్ణారా

సన్న-న- ఇది- అల్పమునకును- జీర్ణమగుటకును పేరు॥

పిన్నం లబ్ధేవిచారితే।

విన్న-న॥ ఇది- పొందబడినదానికిని- విచారింపబడినదానికిని పేరు॥

అన్యర్థాంతితమిశ్రేషు భిన్న

భిన్న-న-ఇది- వేరైనదానికిని-ధరింపబడినదానికిని- కూడినదానికిని పేరు॥

మేతే త్రయస్త్రిషు॥ ౨౮౬॥

ఏతే- ఈ-నన్న-నిన్న-ఖిన్న-శబ్దములు-త్రయః- మూడును త్రిషు- త్రిలింగములయందును వర్తించును.

ఇతి నాంతాః.

—✽ నాంతపదవర్గము ముగిసెను. ✽—

రోపో బాణేరోపణేచ

రోప- పు। ఇది-బాణమునకును- ఎక్కు-పెట్టుటకును పేరు.

లేపో భోజన గర్వయోః।
దర్పో హంకారకస్తూర్యో
బాష్పో నేత్రజలోష్మణోః॥
సూపో వ్యంజనభేదేపి
పకారే వసూదవత్।

లేప పు॥ ఇది- భోజనమునకును- గర్వమునకును పేరు.
దర్ప-పు॥ఇది- అహంకారమునకును- కస్తూరికిని పేరు.
బాష్ప-పు॥ ఇది-కన్నీటికిని-వేడిమికిని పేరు.

సూప-పు। ఈశబ్దము- సూదశబ్దమువలె- పప్పునకును. వంటవానికిని పేరు.

శపథా క్రోశయోశ్శాపః
కపయోర్కేభవానరాః॥
కూపః కుకుంద రేగర్తే-
గుణవృక్షే ప్రహేపి।

శాప-పు। ఇది- శపథమునకును- కోపమువలననిట్టి నట్టి తిట్టునకును పేరు.
కపి-పు। ఇది- సూర్యునకును-ఏనుగునకును-కోతికిని పేరు.

కూప-పు। ఇది- ఆడుదానిపిరుదులమీదనుండుగుంతలకును- గుంటకును- ఓడమీద పెక్కు-ముగట్టు స్తంభమునకును-బావికిని పేరు.

కల్పస్తు ప్రళయే న్యాయే
శాస్త్రే బ్రహ్మదినే విధౌ॥
౨౮౯॥ సురద్రుమే వికల్పేచ
ప్రత్యయశ్చేత్స మార్థకః।

కల్ప-పు॥ఇది- ప్రళయమునకును- న్యాయమునకును శాస్త్రమునకును- బ్రహ్మయొక్క దినమునకును- విధికిని-కల్పవృక్షమునకును-వికల్పమునకును పేరు-ఈకల్ప శబ్దము వ్యాకరణశాస్త్రమున విధింపబడిన కల్పప్రత్యయ మాయెనేని సమానార్థకము అనగా- ప్రభాతకల్పా రాత్రిః- అగ్నికల్పశ్శత్రుః- ఇత్యాదిస్థలములయందు- ప్రాతః కాలసమానము రాత్రియనియు-అగ్నితుల్యుడు శత్రువనియు తెలిసికొనునది.

నిందావిలం బయోః క్షేపో
వపావివర మేధసోః।
రూపం స్వభావే శబ్దాదౌ
సౌందర్యే నాటకేపిచ।

క్షేప- పు॥ ఇది-నిందకును- కాలవిడంబమునకును పేరు.
వపా-స్త్రీ॥ఇది-బిలమునకును-మెదడునకును పేరు.
రూప-న॥ఇది-స్వభావమునకును-శబ్దాదులకును- సౌందర్యమునకును-నాటకమునకును-అపిశబ్దమువలన- ఆకారమునకును పేరు.

వపుః కాయే శుభాకారే

వపుస్-న॥ఇది-శరీరమునకును- శుభమయిన యాకారమునకును పేరు.

త్రపు సీసకరంగయోః॥
స్త్రీణామృతౌ వికాసేచ
పుష్పం
సర్పి ర్ఘృతాంబునోః।
తల్పం శయ్యాట్టజాయాసు
కృపః కశ్చిత్కృపాదయోః॥

త్రపు-న॥ఇది- సీసమునకును తగరమునకును పేరు.
పుష్ప న॥ఇది స్త్రీలబుతువునకును-వికసించుటకును పేరు.

సర్పిస్-న॥ఇది- నేతికిని-ఉదకమునకును పేరు.
తల్ప-న॥ఇది-పాన్పునకును- నీళ్లకుగట్టునట్లక్కకును- ఆవలికిని పేరు.

కృప-ఇది-కృపాచార్యునకు పేరగునపుడు॥ పు॥ దయ నుపేరయినపుడు॥ స్త్రీ॥

మాఘేపుమాన్ వ్రతేక్లీబే తపాః
గోపస్తుపల్లవే। గోస్థాధ్యక్షేమహీపేచ
స్యాద్గోపీశారిబాపిచ॥

ఇతిపాంతాః
శిఫాతరుజటాయాంచశాఖామాంసనదీషుచ।
శఫస్తరూణాం మూలేపి గవాదీనాంఖురేషుచ॥
రేఫస్స్యాత్ వర్ణేదోషాస్యాదధమేతుత్రిలింగకః।

ఇతిఫాంతాః.
స్తంబోగుల్మే ప్యశాఖస్త్రా
డింబః ప్లీహ ఖగాండయోః॥

శంబస్తుముసలాగ్రస్థలోహమండలకేపవౌ।
కంబిరంశేచదంశస్య ఖజాకాయామపిస్త్రియామ్।
ప్రతిబింబేతత్ప్రకృతౌ ప్రతికృత్యాంచ మండలే।
లాంఛనే పిచబింబో స్త్రీ నద్వయోర్బింబికాఫలే।
కంబుర్నా వలయేశంఖే సంఖ్యాయాం జలశుక్తిషు
నంబుర్నా వలయేశంఖే ...
జంబూ స్త్రీ ...
క్లీబం ...
ఇతిబాంతాః
కుంభః కుంజరమూర్ధాగ్రే కుంభకర్ణేఘటేపిచ॥
భూపాద్రీభూభృతౌ

తపసి-ఇది- మాఘమాసమునకుపేరయినపుడు॥పు॥ వ్రతమునకుపేరయినపుడు॥న॥

గోప-పు॥ఇది-గొల్లవానికిని-పశువులదొడ్డికావలిదానికిని- భూమిపతికిని పేరు.

గోపీ- స్త్రీ-ఇది- సుగంధపాలతీగెకును- చాకారమువలనగొల్లదానికిని పేరు.

పాంతపదవర్గము ముగిసెను.

శిఫా-స్త్రీ॥ఇది-ఊడలకును-కొమ్మకును- మాంసమునకును-నదికిని పేరు.

శఫ- న॥ ఇది-వృక్షములమొదటికిని గోవులుమొదలయినవానిగొరిసెలకును పేరు.

రేఫ-ఇది-ధ్వనికిని- రకారమునకును పేరైనపుడు॥పు॥అధనమునకును పేరయినపుడు॥త్రి॥

ఫాంతపదవర్గముముగిసెను.

స్తంబ-పు॥ఇది-పొదకును-కొమ్మలేని- ప్రాణికిని అలిశబ్దమువలనతృణాదులకును పేరు.

డింబ-పు॥ఇది- రొమ్ములో నెడమప్రక్కనుండువచ్చనిమాంసమునకును-పక్షిగ్రుడ్డునకును పేరు.

శంబ-పు॥ఇది-రోకటిపొన్నునకును- వజ్రాయుధమునకును పేరు.

కంబి- స్త్రీ॥ ఇది - వెదురుయొక్క భాగమునకును-గెడ్డునకును పేరు.

బింబ- ఇది-నీడకును- ఆనీడకు కారణమైనప్రకృతికిని- సమానరూపముగాచేయబడిన ప్రతిమకును- మండలమునకును-గురుతునకును పేరైనపుడు॥పు॥ దొండపండునకు పేరైనపుడు॥న॥

కంబు-పు॥ఇది- కడియమునకును- శంఖమునకును-సంఖ్యకును-కప్పచిప్పలకును పేరు.

జంబూ- స్త్రీ॥ఇది- నదికిని- నేరేడుచెట్టునకును పేరు- నేరేడుపండునకు పేరగునపుడు॥న॥

క్లీబ-ఇది- పౌరుషము లేనివానికిని పేరైనపుడు॥త్రి॥ నపుంసకునకు పేరయినపుడు॥న॥

బాంతపదవర్గముముగిసెను.

కుంభ-పు॥ ఇది- ఏనుగుశిరస్సునకును-కుంభకర్ణునికిని-కడవకును-విటునికిని పేరు.

భూభృత్-పు॥ ఇది- భూమినిపాలించురాజునకును- పర్వతమునకును పేరు.

జంభాడంభజంబీరదాన
వాః। దంతేపి చపుమానేవభ
క్త్యావాచిషుసత్రిషు. ౨౬౦।
గర్భోర్భకే నాట్యసంధౌ
కుక్షౌ పనసకంటకే। భ్రూణే
ప్రవరకే
చాథ స్వభూర్వేధాస్మ
రోహరిః। ౨౬౧॥
శంభుర్ధాతృహరీశేషు

డింభో బాలకమూర్ఖయోః।

నాభిర్మధ్యే ప్రధానేంగే
కస్తూర్యాం క్షత్రియేనృపే॥

స్తంభోజాడ్యేప్య

థసభాసమాజేద్యూతస
ద్మ ప్సు।
కదళ్యామప్సరోభేదే రంభా

భాజ్వాలయోః ప్రభా॥
వారిపర్ణ్యాం కట్ఫలేచకుం
భీ స్త్రీ కుంభినోగజాః।
భవ్యేక్లిబె శుభం ద్రవ్యేత్రి
షు.
జృంభస్తుజృంభణే॥౨౬౪॥
త్రిషు నాతువికాసేస్యా
న్నభఃఖం శ్రావణో నభాః।

వ్యాజేనిభో నాసదృశేత్రి
ష్వ
థో వాచ్యలింగకాః॥౨౬౫॥
ప్రభూశక్తాధిపౌ
నిత్యే పత్యౌ సర్వగతే విభుః

ఇతి భాంతాః

జంభ-పు॥ఇది-డంభమునకును నిమ్మపంటికిని- జం
భాసురునకును-దంతమునకును పేరు- ఇది భక్ష్యవాచకమైన
పుడు"త్రి॥

గర్భ-పు-ఇది-బాలునికిని-నాట్యసంధికిని- కుక్షికిని-
పనసకాయముంటిక్కిని- స్త్రీలగర్భమునకును - శ్రేష్ఠునకు
ను పేరు.

స్వభూ-పు।ఇది-బ్రహ్మకును-మన్మథునకిని-విష్ణువున
కును పేరు.

శంభు-పు॥ ఇది- బ్రహ్మకును- విష్ణువునకును- శివుని
కిని పేరు.

డింభ-పు।ఇది- చన్నుగుడుచుబాలునకును- మూ
ఖునికిని పేరు.

నాభి- ఇది మధ్యభాగమునకును-ప్రధానమునకును
పేరైనపుడు॥సీ॥బొడ్డునకు పేరైనపుడు॥ ప్న॥కస్తూరికి పేరైన
పుడు॥ సీ॥క్షత్రియునికిని-జనపాలునకును పేరైనపుడు॥పు। నా
భిః ప్రధానే ప్రాణ్యంగే-అనియొక పాఠాంతరముగలదు.

స్తంభ-పు।ఇది-జడభావమునకును- అపిశబ్దమువలన
స్తంభమునకును పేరు.

సభా-సీ॥ఇది-సమూహమునకును- ద్యూతమునకును-
శాలకును పేరు.

రంభా- సీ॥ఇది- అరటిచెట్టునకును- రంభయనున
ప్సరసకును పేరు.

ప్రభా-సీ॥ ఇది-కాంతికిని- జ్వాలకును పేరు.

కుంభీ-ఇది-నాచునకును- 'కుంకుమాగ్రినికిని పేరగునపు
డు॥సీ॥ ఏనుగునకు పేరగునపుడు కుంభిన్॥పు॥

శుభ-ఇది-కలుగబోవు మేలు శుభమునకు పేరగునపు
డు॥న॥ద్రవ్యమునకు పేరగునపుడు॥త్రి॥

జృంభ-ఇది-ఆవలింతకు పేరగునపుడు॥త్రి॥ వికాసము
నకు పేరగునపుడు॥పు॥

నభస్-ఇది-ఆకాశమునకు పేరగునపుడు॥న॥ శ్రావ
ణమాసమునకు పేరగునపుడు॥పు॥

నిభ-ఇది- వ్యాజమునకు పేరగునపుడు॥పు॥ ఉపమా
నవాచకమైనపుడు॥త్రి॥

ప్రభు- ఇది-సమర్థునకును ప్రభువునకు పేరగునపు
డు విశేష్యలింగము.

విభు-పు॥ఇది-నిత్యమైనదానికిని- పతికిని- అంతటను
న్నదానికిని పేరు.

—※ భాంతవర్గము ముగిసెను. ※—

ద్రుమమా చ్చైద్యసుహృద్వృక్షే

ద్రుమ-పు॥ ఇది॥ శిశుపాలుని స్నేహితునకును- వృక్షమునకును పేరు.

భ్రమమా భ్రాన్త్యంబునిర్గమే-౨౬౬।

భ్రమ-పు॥ ఇది. భ్రాంతికిని-జలధారికిని పేరు.

సోమః కుబేరే కర్పూరే లతాభేదే నిశాకరే।

సోమ-పు॥ ఇది-కుబేరునకును- పచ్చకర్పూరమునకును-సోమలతకును-చంద్రునకును పేరు.

గ్రామః పల్యాం స్వరే బృన్దేత్వయం శబ్దాది పూర్వకః॥

గ్రామ-పు॥ ఇది_పల్లెకును- సర్వమునకును పేరు -ఈ గ్రామశబ్దము సమూహవాచకమైనపుడు శబ్దము మొదలైన శబ్దపూర్వకమైయుండును- ఉదాహరణము- శబ్దగ్రామః- భూతగ్రామః-గుణగ్రామః ఇత్యాదులు-

స్మరాభిలాషయోః కామోనుజ్ఞాయాం కామమవ్యయమ్।

కామ-పు॥ ఇది- మన్మథునకును- కోరికకును పేరు-అనుజ్ఞకు పేరయినపుడు- కామమ్ అనియవ్యయము.

శక్తౌ చరణవిక్షేపే పరిపాట్యామపి క్రమః॥౨౬౭॥

క్రమ పు॥ ఇది-సామర్థ్యమునకును- నడుపునకును స్వాధ్యాయక్రమమునకును పేరు.

ఆత్మా యత్నధృతిస్వాంత స్వభావ పరమాత్మసు। జీవబుద్ధిశరీరేషు

ఆత్మన్-పు॥ ఇది- యత్నమునకును-ధైర్యమునకును మనస్సునకును-స్వభావమునకును-పరమాత్మకును- జీవునికిని బుద్ధికిని శరీరమునకును పేరు,

రశ్మిస్తు ప్రగ్రహేద్యుతౌ

రశ్మి-పు॥ ఇది-పగ్గమునకును-కాంతికిని పేరు.

శ్యామాకాదౌ ద్రుమే గరుత్మత్

గరుత్మత్-స్త్రీ॥ ఇది_చేమలు-ఊదలు- మొదలయినతృణ ధాన్యములకును-వృక్షములకును పేరు.

క్రిమిస్స్యాత్ కీటలాక్షయోః।

క్రిమి-పు॥ ఇది-పురుగునకును_లత్తుకకును పేరు.

గ్రీష్మోష్మ బాష్పేషూష్మాణ

ఊష్మన్-పు॥ ఇది- గ్రీష్మకాలమునకును- వేడిమికిని- కన్నీటికిని పేరు.

ఊమో వ్యోమని పత్తనే।

ఊమ-పు॥ ఇది-ఆకాశమునకును-పత్తనమునకును పే

సామ వేదే సామ్ని

సామన్ -న॥ ఇది-సామవేదమునకును- మంచిమాటలాడుటకును పేరు.

దమో దండే చేంద్రియనిగ్రహే।

దమ-పు॥ ఇది_శిక్షకును-ఇంద్రియనిగ్రహమునకును పేరు.

గుల్మస్తస్నం జేప్లీహ్ని ఘుచే ర్ణోగసైన్యవిశేషయోః।

గుల్మ-పు॥ ఇది- చెట్టు మొదలుకొని కొమ్మవరకుగల భాగమునకును-రొమ్మున నెడమప్రక్కనుండుపచ్చనిమాంసవిశేషమునకును కడవకును-గుల్మవ్యాధికిని-సేనాభేదమునకును పేరు.

క్ష్మాయామస్యాముజలే చంద్రే (చంద్రునకును పేరు.

క్ష్మాయ- మ్యామ-పు॥ ఈ ౩నుఉదకమునకును-

యమస్తు యమళే_తకే।శరీరసాధనాపేక్ష నిత్యకర్మణి సంయమే॥౨౭౨॥

యమ-పు॥ ఇది- అమడలకును_యమునికిని-శరీరమాత్రమునుసాధనముగానపేక్షించుచునిత్యముగా జేయదగిన [illegible] పేరు.

ఉమాస్యాదతసీగౌరీహ
రిద్రాకీర్తి కాంతిషు।
సీమసీమేఽద్వయేక్షేత్రే కూల
మర్యాదయోరపి॥ ౨౬౯॥

ఉమా - స్త్రీ॥ ఇది - నల్లగసిచెట్టునకును - గౌరికిని - పసపునకును - కీర్తికిని - కాంతికిని పేరు -

సీమన్ - సీమా - స్త్రీ॥ ఈ క్షేత్రమునకును - నద్యాదుల యొక్క - గట్టునకును - పొలిమేరకును పేరు.

బ్రాహ్మీ స్యుబ్రహ్మశక్తిస్సా సోమ
వల్లీ సరస్వతీభారతీ చ సా।
లక్ష్మీస్సంపద్రమా శోభా

బ్రాహ్మీ - స్త్రీ॥ ఇది - బ్రహ్మశక్తికిని - పొన్నగంటిచెట్టునకును - సరస్వతికిని పేరు.

లక్ష్మీ - స్త్రీ॥ ఇది - సంపత్తునకును - లక్ష్మీదేవికిని - కాంతికిని పేరు.

జామిస్స్వసృకులస్త్రియోః।
రుమా సుగ్రీవభార్యాయాం
సైవ స్యాల్లవణాకరే।
సూక్ష్మః ప్రాంతేషు సూ
త్రాదేః కింజల్కే నేత్రలోమసు॥ ౨౭౦॥

జామి - స్త్రీ॥ ఇది - తోడబుట్టినదానికిని - కులస్త్రీకిని పేరు

రుమా - స్త్రీ॥ ఇది - సుగ్రీవునిభార్యకును - ఉప్పుసముద్రమునకును పేరు.

సూక్ష్మ॥ పు॥ ఇది - దారము మొదలయినవానియొక్క - కొనలకును - ఆకరువుపువ్వులకుసుమ - కనుఱెప్పమీది రోమములకును పేరు.

పల్లి గంధేఽపి చ పక్ష్మస్యా

పక్ష్మన్ - న॥ ఇది - పాయిరంధ్రమునకును - చకారము వలన ఱెప్పకును పేరు.

ల్లక్ష్మ చిహ్నప్రధానయోః।
ధామ గేహప్రభాస్థానప్రభా
వసుఖసద్మసు॥ ౨౭౧॥

లక్ష్మన్ - న॥ ఇది - చిహ్నమునకును - శ్రేష్ఠునకును పేరు

ధామన్ - న॥ ఇది పుట్టుకకును - కాంతికిని - ఉనికిపట్టునకును ప్రభావమునకును - సుఖమునకును - గృహమునకును పేరు.

కర్మవ్యాసే క్రియాయాం
చ వర్త్మ నేత్రచ్ఛదాధ్వనోః।
హేమ్ని రేతసి భర్మస్యాచ్ఛ
ద్మసద్మని కైతవే।

కర్మన్ - న॥ ఇది - వ్యాసునికిని - క్రియకును పేరు.

వర్త్మన్ - న॥ ఇది - కనుఱెప్పకును. మార్గమునకును పేరు.

భర్మ - ఇది - బంగారమునకును - రేతస్సుకును పేరు.

ఛద్మన్ - న॥ ఇది - గృహమునకును. కపటమునకును. పేరు.

తమోరాహౌ గుణే ధ్వాంతే శోకే

తమస్ - న॥ ఇది - రాహువునకును - తమోగుణమునకును - చీకటికిని - శోకమునకును పేరు.

వ్యోమ నభోంబునోః।

వ్యోమన్ - న॥ ఇది - ఆకాశమునకును - ఉదకమునకును పేరు.

రామః పశౌ జామదగ్న్యే
బలరాఘవయోశ్చ నా॥
సితాసితమనోజ్ఞేషు త్రిషు
రామా తు భామినీ
శ్యామా షోడశవర్షా స్త్రీ
త్రినృత్తా శారిభా నిశా॥ నీలీ
ప్రియంగు కృష్ణేషు పుంస్యయం
తద్వతి త్రిషు।

రామ పు॥ ఇది - పశువునకును - పరశురామునకును - బలరామునకును - శ్రీరామునకును పేరు, ఈశబ్దము తెలుపునకును - నలుపునకును - సుందరమైనదానికిని పేరైనపుడు - త్రి.

రామా - స్త్రీ॥ ఇది - స్త్రీకి పేరు.

శ్యామా - ఇది - పదునారుసంవత్సరములవయస్సుగల స్త్రీకిని - తెల్లతెగడకును - సుగంధపాలకును - రాత్రికిని పేరైనపుడు - స్త్రీ - నీలిచెట్టునకును - ప్రేంకణపుచెట్టునకును - నలుపు పచ్చమునకును పేరైనపుడు పు. ఆవర్ణముగలదానికిని పేరైనపుడు - త్రి॥

క్షమా క్షోణ్యాం త్రిషు క్షా యాం యోగ్యే శక్తహితేషు చ॥ ౬౮॥ త్రిష్వ

క్షమా-ఇది-భూమికిని- ఓర్పునకును పేరయినపుడు-స్త్రీ-యోగ్యునికిని-సమర్థునికిని- హితునికిని పేరయినపుడు-త్రి.

క్షేమమస్త్రీ స్యాన్మంగళే రక్షణే-

క్షేమ-స్న॥ ఇది- శుభమునకును- సంపాదించినదానినికిని-రక్షించుటకును పేరు.

ఋతునామమస్త్రీ ప్వాపక్వే ప్యామేత్యామం త్రిణోవ్యయమ్॥ ౬౯-౭॥

ఆమ-ఇది-బుజువైనదానికిని పేరయినపుడు- పు-అపక్వమయినదానికిని పేరయినపుడు-త్రి- సంబోధనమైనపుడవ్యయము.

భీషణే త్రిషు భీష్మస్సాన్ శ్రుతౌ ద్రగాంగేయయో స్తునా॥

భీష్మ-ఇది-భయంకరమైనదానికి పేరయినపుడు-త్రి శివునికిని-భీష్మాచార్యునకు పేరగునపుడు-పు.

క్షౌమం సంయుక్తా లేవానాల్పే

క్షౌమ-ఇది-తెల్లవస్త్రమునకు పేరగునపుడు-న- అల్పమునకును పేరగునపుడు-స్న.

భీమశ్శంభౌ వృకోదరే॥ ౭౦॥ ఘోరే త్రిష్వ

భీమ-ఇది-శివునకును- భీమునికిని పేరగునపుడు-పు. భయంకరమయినదానికి పేరగునపుడు-త్రి.

థధర్మోస్త్రీ పుణ్యే సామాన్యభావయోః । చాపన్యాయయోర్ధ్వరాహింసా యజ్వాచారయమేషు నా॥ ౭౧॥

ధర్మ-ఇది-పుణ్యమునకును- సామాన్యమునకును-నత్తకును పేరయినపుడు-స్న-ధనుస్సునకును- న్యాయమునకును-యాగమునకును-హింసింపకుండుటకును- సోమయాజికిని-ఆచారమునకును-యమునికిని పేరగునపుడు-పు.

హిమస్త్రీ తేత్రిషుక్లీబే ప్రాలేయే చందనేపిచ।

హిమ-ఇది- చలికి పేరయినపుడు. త్రి- మంచునకును గంధమునకును- పేరయినపుడు-న.

తోక్మం క్లీ బేకర్ణే మలేహరితేపు త్రిలింగకః॥ ౭౨॥ హరిద్యవేనా

తోక్మ-ఇది-గులిమికి పేరయినపుడు-న- పచ్చనిదానికి పేరగునపుడు-త్రి-పచ్చయవలకు పేరయినపుడు-పు.

ప్రేమాతునస్త్రీ యాం స్నేహనర్మణోః।

ప్రేమన్-స్న-ఇది-స్నేహమునకును- క్రీడకును పేరు.

వామావధ్వాం సవ్యరమ్య ప్రతీపే ష్వేషవాచ్యవత్॥

వామా-ఇది-స్త్రీకి పేరగునపుడు-స్త్రీ. ఎడమప్రక్కకును-సుందరమయినదానికిని- ప్రతికూలమయినదానికిని పేరగునపుడు విశేష్యలింగము.

వామీస్సృగాలీబడబా రాసభీకరభేష్వథ।

వామీ- స్త్రీ॥ ఇది-స్త్రీజాతులయిననక్కగుఱ్ఱము-గాడిదె-ఒంటె వీనికి పేరు.

క్రమాత్సంఖ్యా హ స్తిబిందోర్వ్యూహాంత రాహిషు। ౭౪॥ అబ్జనిధౌచ త్రియోః పద్మఃక్లీబే పుంస్యస్త్రియాం।

పద్మ-ఇది- సంఖ్యకును ఏనుగుశిబ్బెమునకును పేరైనపుడు-న- నిధికిని-పద్మవ్యూహమునకును- సర్పమునకును పేరయినపుడు-పు-కమలమునకు పేరగునపుడు-స్న-ఛారంగికిని-లక్ష్మికిని పేరయినపుడు-స్త్రీ.

పద్మన్ శుభాకారే ప్రమాణవపుషోరపి। ౭౫॥

వద్మన్-స్న-ఇది-శుభమయిన యాకారమునకును ప్రమాణమునకును-శరీరమునకు పేరు.

సమాస్త్రీ వత్సరేనా

సమా-ఇది-సంవత్సరమునకు పేరగునపుడు-స్త్రీ-సజ్జను

ర్వాతుల్యేషుతుత్రిషు।

ఊర్మిర్ద్వయోస్స్వదు త్యంతావస్త్ర సంకోచరేఖికా॥ ౫౮॥ తరంగశ్చా

భనేమిస్త్రీస్న చక్రాంతేభిత్తిమూలకే - కూపత్రికాయాంనాత్వేష భవేత్తినిశపాదపే॥ ౫౯॥

పరమాత్మాతపో వేదో బ్రహ్మా బ్రహ్మణ్యజేద్విజే। ఋత్విజ్య

భకుజేద్రైత్యేభౌమోనాథ భూర్భవేత్రిషు। ౬౦॥

శ్రీమాన్ తిలకవృక్షేపి

ధీమాన్ వాచస్పతావపి।

స్వామీస్కందేప్య

థోజాల్మస్త్వవైనాలోచ్యకారిణి॥ ౬౧॥ నిర్బుద్ధావపి

జిహ్మస్తుమందేవక్రే ప్యుభౌత్రిషు।

ఇతిమాంతాః.

చయస్సమూహే ప్రాకారే మూలబంధేచసంగ్రహే।

నయోనితో ద్యూతభేదే తార్క్ష్యోశ్వేగరుడేరథే।

కలినక్షత్రయో స్తిష్యః

స్యాద్వియః కాలసూకయోః॥ ౬౨॥

మన్యుఃక్రోధేక్రతౌదైన్యే

నికిపేరయినపుడును- సర్వనామవాచకమయినపుడును_తుల్యావాచకమయినపుడు-త్రి.

ఊర్మ్మి-స్త్ర-ఇది-అత్యంతాశక్తికిని- వస్త్రపుకుచ్చిళ్ళకును-అలకునును-చకారమువలన పరంపరకును పేరు.

నేమి-ఇది--బండియంచునకును- గోడయడుగునకును-బావియంచునకును పేరయినపుడు-స్త్రీ- నెంమిచెట్టునకు పేరయినపుడు-పు॥

బ్రహ్మ-ఇది-పరమాత్మకును-తపస్సునకును-వేదమునకును పేరగునపుడు-న బ్రహ్మదేవునికిని- బ్రాహ్మణునికిని ఋత్విజునకును పేరయినపుడు-పు.

భౌమ-ఇది_అంగారకునకును- నరకాసురునకును పేరయినపుడు- పు- భూమియందుబుట్టినదానికి పేరగునపుడు త్రి.

శ్రీమత్ పు-ఇది-తిలకవృక్షమునకును-అపిశబ్దమువలన శ్రీమంతునికి పేరు.

ధీమత్-పు॥ఇది-బృహస్పతికిని- అపిశబ్దమువలనబుద్ధిమంతునికిని-పండితునకును పేరు.

స్వామిన్-పు॥ఇది కుమారస్వామికిని- అపిశబ్దమువలన నేలెడువానికిని-ధనికునికి పేరు.

జాల్మ-పు॥ఇది-జడునకును- ఆలోచనసేయక కార్యము జేయువానికిని-బుద్ధిహీనునికిని పేరు.

జిహ్మ-త్రి॥ఇది-మందునికిని-వక్రమైనదానికిని పేరు.

ఉభౌ-ఈజాల్మజిహ్మశబ్దములు_ను- త్రిషు-త్రిలింగములయందును వర్తించును.

—※ మాంతపదవర్గముముగిసెను. ※—

చయ-పు।ఇది-సమూహమునకును_ ప్రాకారమునకును-సంసారబంధమునకును- సంగ్రహించుటకును పేరు.

నయ-పు॥ఇది-నీతికిని ద్యూతవిశేషమునకును పేరు.

తార్క్ష్య-పు॥ఇది-గుఱ్ఱమునకును-గరుడునకును-రథమునకును పేరు.

తిష్య పు।ఇది-కలియుగమునకును-పుష్యనక్షత్రమునకును పేరు.

వియ-పు॥ఇది-యమునికిని-గుడ్లగూబకును పేరు.

మన్యు-పు॥ఇది_కోపమునకును- యాగమునకును-దైన్యమునకును పేరు.

దస్యుః ప్రత్యర్థి చోరయోః।
క్షయో రోగే గృహే కల్పాంతే
క్షయోరోగార్త తరేక
ల్పాంతేగృహేపచయే ప్యథ
నాశేసంశ్లేషణే తౌర్యత్రి
కసామ్యేభవేల్లయః।
దాయోధనే విభక్తవ్యపి
తృద్రవ్యే వయాతకే। ౨౯౫

దస్యు-పు॥ఇది-విరోధికిని-దొంగకును పేరు.

క్షయ-పు॥ఇది-రోగభేదమునకును కల్పాంతమునకు
ను-గృహమునకును. నాశమునకును పేరు.

లయ-పు॥ఇది-నాశమునకును- ఆలింగమునకును-
నృత్తగీతవాద్యములసామ్యమునకును పేరు,

దాయ-పు॥ఇది-ధనమునకు- విభాగించుకొనదగినపి
తృద్రవ్యమునకు-వివాహకాలమునందునల్లునికిమామయిచ్చు
వస్తువులకును పేరు.

ప్రాయో వయో మృత్యు
తుల్య బాహుళ్యానశనేషు
నా। ప్రాయోవ్యయంచబా
హుళ్యే
స్యాదర్యస్స్వామివైశ్య
యోః। ౨౯౬॥

ప్రాయ-పు॥ఇది-వయస్సునకును-మృత్యువునకునుస
మానముగుటకును- బాహుళ్యమునకును - అనశనవ్రతము
నకును పేరు- ఈప్రాయశబ్దముబాహుళ్యార్థకమై నపుడ
వ్యయముంగలదు.

అర్య పు॥ఇది-ప్రభువునకును-వైశ్యునికిని పేరు.

కక్ష్యాకచ్ఛేవరత్రాయాం
కాంచ్యాంగేహప్రకోష్ఠకే।

కక్ష్యా-స్త్రీ॥ఇది-కచ్ఛకును-ఏనుగునడుమునగట్టుతో
లుమోకునకును- మొలనూలికిని- యింటిలోపట్టికట్టునకును
పేరు.

సంధ్యాసంధౌ పితృప్రసూప్వాం
ప్రతిజ్ఞాసీమయోరపి। ౨౯౭
ఛాయా కాంతిస్సూర్య
జాయాప్రతిబింబనాతపః
త్రయీ త్రివేద్యాంత్రితయే

సంధ్యా-స్త్రీ॥ఇది-సంధికిని- సాయంకాలమునకును-
ప్రతిజ్ఞకును-ఎల్లకును పేరు.

ఛాయా-స్త్రీ॥ఇది-కాంతికిని- సూర్యునిభార్యకును-
ప్రతిబింబమునకును-నీడకును పేరు-

త్రయీ-స్త్రీ॥ఇది- వేదత్రయమునకును-మూడింటికిని
పేరు.

వ్రజ్యావర్గేసతామపి॥

వ్రజ్యా-స్త్రీ॥ఇది- సజ్జనులసమూహమునకు-అపిశబ్ద
మువలనభిక్షార్థమయిపలుమారుదిరుగుటకును పేరు,

క్రియాతుచేష్టాకరణసం
ప్రధారణకర్మసు। శిక్షారం
భోపాయపూజా చికిత్సాని
ష్కృతిష్వపి॥ ౨౯౮॥

క్రియా-స్త్రీ॥ఇది బుద్ధిపూర్వకవ్యాపారమునకునువ్య
వహారమునందునిశ్చయముపుట్టించులిఖితసాక్ష్యాదులకును-
వ్యాపారమునకును-శిక్షకును-ఉద్యోగమునకును- ఉపాయ
మునకును-పూజకును-చికిత్సకును- ప్రాయశ్చిత్తమునకును-
అపిశబ్దమువలనధాత్వర్థమునకును పేరు.

శబ్దగుంభేపిశయ్యాస్యా

శయ్యా-స్త్రీ॥ఇది-శబ్దములగూర్చుటకును-అపిశబ్దము
వలనపాన్పునకును పేరు.

త్కన్యారాశ్యంతరేపిచ।

కన్యా-స్త్రీ॥ఇది-రాశిభేదమునకును- అపిశబ్దమువలన
ఋతువుగానిపడుచునకును పేరు.

వీర్యంపరాక్రమేశుక్రే
ద్రవ్యంవిత్తేగుణాశ్రయే

వీర్య-న॥ఇది-పరాక్రమమునకును-రేతస్సునకును పే
ద్రవ్య-న॥ఇది-ధనమునకును-రూపాదిగుణములకా
శ్రయమయినవస్తువులకును పేరు.

గుహ్యం రహస్యేపస్థే

గుహ్య-న॥ఇది-రహస్యమునకును-...-త్రి-స్త్రీ-పు

పయః పానీయదుగ్ధయోః।
పయః పక్షిణిబాల్యాదౌ
వత్సరేయావనేపిచ॥ ౩౦౧
మాల్యంపుష్పే పుష్పదా
మ్ని
మూల్యంవేతనవస్త్రయోః
చైత్యమాయతనేబుద్ధేడిం
భేచోద్దేశపాదపే॥ ౩౦౨॥

కాంస్యం వాద్యం తరే
పానపాత్రే తైజనవస్తుని।
నాట్యంతౌర్యత్రికే నృత్తే

హ్యాజ్యంశ్రీవాససర్పిషోః॥
శ్లోకే పద్యం స్త్రియాం
మార్గే
కావ్యం గ్రంథే కవౌపు
మాన్।
గవ్యాత్తావపి గవ్యాస్నా
న్నద్వయోర్దృశి వ్యవాయ
యోః॥ ౩౦౪॥
రూప్యంస్యాదాహతస్వ
ర్ణేరజతేతద్విభూషణే। సు
రూపే త్రిషు
పూజ్యస్తుత్రిష్వర్చ్యేశ్వశు
రేపుమాన్-౩౦౫॥
స్యాత్తథ్యేశపథేసత్యం
లోకేనాత్రిష్వృతాన్వితే।

యయురశ్వేశ్వమేధీయే
దీర్ఘాయష్ట్యాం త్వయంస్త్రి
యాం॥ ౩౦౬॥
ఋషితీర్థేవేశ్యాయంకా
యోదేహసమూహయోః।
కుదేవతాస్త్రిష్వేష

ఋషులగుహ్యావయవములకు పేరయినపుడు-న- చకారమువ
లనదా చేటికిని పేరు.

పయస్-న-ఇది-ఉదకమునకును-పాలకును పేరు.

వయస్-న॥ఇది-పక్షికిని-బాల్యము మొదలయినవయ
స్సులకును-సంవత్సరమునకును-యౌవనమునకును పేరు.

మాల్య-న॥ఇది-పుష్పమునకును- పుష్పహారమునకు
ను పేరు.

మూల్య-న॥ఇది-కూలికిని-వస్త్రమునకును పేరు.

చైత్య-న॥ఇది-యజ్ఞశాలకును- పక్షాంతరమున బౌ
ద్ధాలయమునకును- బుద్ధదేవునకును- శివునకును. రచ్చమ్రా
నికిని పేరు.

కాంస్య-న॥ఇది-వాద్యభేదమునకును. పాత్రమునకు
ను-లోహవస్తువునకును పేరు.

నాట్య-న॥ఇది-నృత్తగీతవాద్యములకుమూటికిని-నృ
త్తమునకును పేరు.

ఆజ్య-న॥ఇది-సరళదేవదారుబంకకును-నేతికి పేరు.

పద్య-ఇది-శ్లోకమునకు పేరయినపుడు-న- మార్గ
మునకు పేరయినపుడు-స్త్రీ.

కావ్య-ఇది- గ్రంథమునకు పేరగునపుడు-న- శుక్రు
నకు పేరగునపుడు-పు.

గవ్య-ఇది-రెండుక్రోసులదూరమునకును-అపిశబ్దమువ
లనగోసమూహమునకును పేరగునపుడు స్త్రీ-గోవులపాలు పె
రుగు మొదలైనద్రవ్యములకును-ధా-ర్యకును పేరగునపుడు-న

రూప్య-ఇది-కరిగిపోసినబంగారునకును- వెండికిని-
ఆ వెండిసొమ్మునకును పేరగునపుడు-న- అందమయినదానికి
పేరగునపుడు-త్రి.

పూజ్యఇది-పూజ్యునికి పేరగునపుడు-త్రి-కన్యనిచ్చిన
మామకు పేరగునపుడు-పు.

సత్య-ఇది-యథార్థమునకును- శపథమునకును పే
రయినపుడు-న-సత్యలోకమునకు పేరయినపుడు-పు- సత్య
వంతునికి పేరగునపుడు- త్రి.

యయు-ఇది. అశ్వమేధయాగమునకుదగినగుఱ్ఱము
నకు పేరగునపుడు-పు- పొడవైనకఱ్ఱకు పేరైనపుడు స్త్రీ.

కాయ-ఇది-చిటికెనవ్రేలుదర్భవ్రేళ్ళనడుమనిడునవ
లయు ఋషిసంబంధమైనతీర్థమునకు పేరగునపుడు- న-
దేహమునకును-సమూహమునకును పేరయినపుడు-పు- కు
[illegible] గునపుడు- త్రి.

జయ స్తువిజయే పుమాన్ ॥ ౩౦౯॥ జయాతు పథ్యాత ర్కారీ తిథిభేద ఉమాసఖీ।

జయ-ఇది- జయమునకు పేరగునపుడు-పు- కరక చెట్టునకును-తక్కిలిచెట్టునకును-జయతిథికిని-పార్వతీదేవిచెలికత్తెకును పేరగునపుడు స్త్రీ.

వన్యావన సమూహే స్యా ద్వన్యం త్రిషు వనోద్భవే।

వన్యా-ఇది- వనసమూహమునకు పేరగునపుడు-స్త్రీ- వనమున బుట్టినవానికి పేరగునపుడు-త్రి.

ఏకత్వాదౌ విచారే చ సంఖ్యా సంఖ్యం తు సంయుగే।

సంఖ్య-ఇది-ఒకటి మొదలయిన లెక్కకును ప్రమాణము చేత సద్గుణమును పరీక్షించుటకును పేరగునపుడు-స్త్రీ-యుద్ధమునకు పేరగునపుడు-న.

అస్త్రీ మధ్యం సమే న్యాయ్యే ప్యవకాశావలగ్నయోః।
త్రిషు సాధ్యం సాధనీయే నాయోగే గణదైవతే।

మధ్య-మ్న-ఇది-సమభాగమునకును- న్యాయముగలదానికిని-మధ్యప్రదేశమునకును-నడుమునకును పేరు.

సాధ్య-ఇది-సాధింపదగినదానికి పేరగునపుడు-త్రి- సాధ్యనామయోగమునకును-గణదేవతకును పేరగునపుడు పు

హృద్యం హృదో ప్రియే హృజ్జే హృత్ప్రియే చ త్రిలింగకమ్। ౩౧౦ ॥ వశ్యకృద్వేద మంత్రే తు హృద్యో హృద్యం విలేపనే।

హృద్య ఇది హృదయమున కిష్టమైనదానికిని- హృదయమున బుట్టినదానికిని - మనస్సునకు సంతోషకరమైనదానికిని పేరగునపుడు-త్రి- వశ్యకరమైన వేదమంత్రమునకు పేరగునపుడు-పు-గంధాది లేపనద్రవ్యమునకు పేరయినపుడు-న.

సౌమ్యః పుమాన్ బుధే విప్రే త్రిషు స్యాత్సోమదైవతే ॥ ౩౧౧॥ రమ్యేనుగ్రే చ

సౌమ్య-ఇది-బుధునికిని- బ్రాహ్మణునికిని పేరగునపుడు-పు-సోముదేవతాకమయిన హవిస్సు వస్తువునకును- రమ్యమైనదానికిని-ఉగ్రముకానిదానికిని పేరయినపుడు-త్రి.

జన్యం తు రథ్యా కలహయుద్ధయోః। జన్యామాతా పితా జన్య స్త్రీషు తూత్పాద్య నీచయోః ॥ ౩౧౨॥ జ్ఞాతౌ భృత్యాం నవోఢాయాం జన్యా స్నిగ్ధా వరస్యయే।

జన్య-ఇది-వీధిజగడమునకును-యుద్ధమునకును పేరైనపుడు- స్త్రీ-తల్లికి పేరైనపుడు-స్త్రీ తండ్రికి పేరయినపుడు-పు పుట్టింపదగినవానికిని-నీచునికిని పేరగునపుడు- త్రి-జ్ఞాతికిని-క్రొత్త పెండ్లికూతునకును- పెండ్లికొడుకుయొక్క చెలికాండ్రకును పేరగునపుడు-పు.

అశ్లీలే సురతే గ్రామ్యం గ్రామ్యః పల్లిభవే జనే ॥ ౩౧౩॥

గ్రామ్య-ఇది-పామరజనవాక్యమునకును- సురతమునకును పేరగునపుడు-న- పల్లెయందు బుట్టిన జనులకు పేరయినపుడు-పు.

రథ్యా రథౌఘే విశిఖే రథ్య స్తు రథవోఢరి।

రథ్యా-ఇది-రథసమూహమునకు గ్రామమునందు-ప్రధానమయిన రచ్చమిట్టకును పేరగునపుడు-స్త్రీ- రథమును హించుగుఱ్ఱము మొదలయినవానికి పేరగునపుడు-పు.

హరీతక్యాం తు పథ్యా స్యాత్ హితే పథ్యం త్రిలింగకమ్।

పథ్యా-ఇది- కరకచెట్టునకు పేరగునపుడు-స్త్రీ- శరీరమునకు హితమయినదానికి పేరయినపుడు-త్రి.

కర్మ్యాన బాధకే గృహ్యం యత్స్వవశే గే త్రిషు గృహ్యాం శాఖాపురం గృహ్యా గృహాసక్తామృగాః ఖగాః ॥ ౩౧౪॥

గృహ్యా-ఇది- కర్మబోధక గ్రంథమునకు పేరైనపుడు ని-వశ్యునికి పేరయినపుడు-త్రి-రాజధానికన్న వేరుగా సమీపమున కట్టబడియున్న పట్టణమునకు పేరయినపుడు-న- ఇంపుడుమృగములకును-పక్షులకును ... గునపుడు-పు.

సహ్యాద్రౌ సహ్యమారో
గ్యంసోఢశక్యేత్వేవ వాచ్యవ
త్।

సహ్య-ఇది-పర్వతమునకు పేరగునపుడు-పు ఆరో
గ్యమునకు పేరయినపుడు-న-సహింపదగిన దానికి పేరగున
పుడు-విశేష్యలింగము.

యోగ్యంక్లీబే పుష్పయాన
చందనాభ్యాసవాచకమ్।
ప్రవీణోపాయవచ్ఛక్తయో
గార్హేఽప్యయం త్రిషు।

యోగ్య-ఇది-భక్ష్యమునకును వాహనమునకును-
చందనమునకును- అభ్యాసమునకును పేరయినపుడు-న-నే
ర్పరికిని-ఉపాయవంతునకును। సమర్థునకును-యోగాభ్యాస
మునకుదగినవానికిని పేరగునపుడు-త్రి.

ధర్మాంబుపుష్పస్వర్ణేషు
పుణ్యంధర్మవతి త్రిషు।

పుణ్య ఇది- ధర్మమునకును- ఉదకమునకును-పుష్ప
మునకును-బంగారునకును పేరగునపుడు- న-ధర్మవంతుని
కి పేరగునపుడు-త్రి.

త్రిషుచోద్యంచోదనాక్లీ
బేతుప్రశ్నచిత్రయోః।

చోద్య-ఇది-ప్రేరేపింపదగిన దానికి పేరయినపుడు-
త్రి-ప్రశ్నకును-ఆశ్చర్యమునకును బేరయినపుడు-న.

ధిష్ణ్యశుక్రాసలౌధిష్ణ్య
మృక్షేస్థానేగృహేబలే।

ధిష్ణ్య-ఇది-శుక్రునకును-అగ్నికిని బేరగునపుడు-పు
నక్షత్రమునకును-స్థానమునకును-గృహమునకును-బలమున
కును బేరయినపుడు-న.

భవ్యంసత్యేశుభేక్లీబంత్రి
షుస్యాద్యోగ్యభావినోః।

భవ్య-ఇది-సత్యమునకును- శుభమునకును బేరగున
పుడు న-యోగ్యమయిన దానికిని- ముందుకలుగబోవుదాని
కిని బేరయినపుడు-త్రి.

సేవ్యత్రిలింగం సేవార్హేక్లీ
బేతుస్యాదుశీరకే॥ ౩౧॥

సేవ్య-ఇది- సేవింపదగిన దానికి బేరైనపుడు-త్రి-వట్టి
వేరునకు బేరయినపుడు-న.

ఇభ్యాకరేణ్వాం త్రిష్వాఢ్యే

ఇభ్య-ఇది-స్త్రీగజమునకు బేరైనపుడు స్త్రీ-ధనవంతు{నికి పేరయినపుడు-త్రి.}

భృత్యోదాసే భృతేస్త్రీ
యాం.

భృత్య-ఇది-దాసునికి బేరయినపుడు పు- కూలికి బేర
గునపుడు-స్త్రీ.

కృత్రిమసూల్పనదీకుల్యాప్ర
ణాళ్యాంచకులోద్భవే।కుల్య
స్త్రీష్వస్థికుల్యస్యా

కుల్య-ఇది-త్రొవ్వబడిన కొంచెపుకాలువకును- జల
ధారికిని బేరయినపుడు-స్త్రీ- సత్కులమున బుట్టిన దానికి బేరగు
నపుడు-త్రి-ఎముకకు బేరగునపుడు-న.

దథకల్యమహర్ముఖే।కల్యా
కల్యాణవాచుస్యాత్త్రిషు నీ
రోగదక్షయోః॥ ౩౨॥

కల్య-ఇది- ప్రాతఃకాలమునకు బేరగునపుడు-న-శు
భవాక్కునకు బేరగునపుడు-స్త్రీ-రోగహీనునికిని- నేర్పరికిని
బేరయినపుడు-త్రి.

శల్యంచంశశలాకాయాం
శస్త్రతోమరయోరపి।శల్యః
శ్వావిన్మహీపాలశ్వావిన్మద
నపాదపః। ౩౩॥

శల్య-ఇది- వెదురుతూలికపుల్లకును- మేకునకును-
నేజాయను నాయుధమునకును బేరగునపుడు-న- శల్యు
డనురాజునకును-ఏదుపందికిని - మంగచెట్టునకును బేరగున
పుడు-పు.

ఆస్యంవక్త్రేవక్త్రభవేక్లీ
బేనక్రభవేత్రిషు।

ఆస్య-ఇది-ముఖమునకును- నోటికిని బేరగునపుడు-
న-ముఖమున బుట్టిన దానికి బేరగునపుడు త్రి.

కశ్యమద్యం సురాకశ్యక
శ్యత్రిషుకశాహకే।

కశ్య ఇది-గుఱ్ఱముయొక్క నడుమునకును-కల్లునకు
ను బేరగునపుడు-న-అపరాధమువలన చబుకుదెబ్బ కుదగిన
వానికి బేరగునపుడు-త్రి.

దూష్యంపటగృహం దూ
ష్యాకక్ష్యా నింద్యే త్వయం
త్రిషు।

దూష్య-ఇది-గుడారమునకు పేరగునపుడు॥న॥ ఏను
గునడుమునగట్టుతోలు మోకునకు పేరగునపుడు॥ స్త్రీ॥ నిందిం
పదగిన దానికి పేరగునపుడు॥ త్రి॥

శరవ్యసంఖ్యావ్యాజేషు
లక్ష్యఃదృశ్యేత్వయంత్రిషు।

లక్ష్య-ఇది-గురికిని- లెక్క-కును లెక్కలకును- పేర
గునపుడు॥ న॥ అగుపడు దానికి పేరగునపుడు॥ త్రి॥

ఇజ్యాస్త్రీ యాగదానా
ర్చాసంగేష్వజ్యో బృహస్ప
తౌ।

ఇజ్యా- ఇది- యాగమునకును- దానమునకును-
పూజకును- సంబంధమునకును పేరగునపుడు॥ స్త్రీ॥ బృహస్ప
తికి పేరగునపుడు॥ పు॥

గౌర్యామార్యాత్రిషుత్వే
షకులీనన్యాయ్యసాధుషు॥

ఆర్యా- ఇది- పార్వతికి పేరగునపుడు॥స్త్రీ॥ సత్కుల
మునబుట్టినవానికిని- న్యాయము దెలిసినవానికిని- సజ్జనులకు
ను పేరగునపుడు॥ త్రి॥

కృత్యంకార్యే దేవతాయాం
కృత్యాస్త్రీకుపితేత్రిషు।

కృత్య-ఇది-కార్యమునకు పేరగునపుడు॥స్త్రీ॥ కోపము
నుబొందినవానికి పేరగునపుడు॥ త్రి॥

పునరర్థే వ్యయంభూయో
భూయాన్ బహుతరేత్రిషు

భూయస్-ఇది-మరలననునర్థమున॥అ॥ విస్తారమను
నర్థమున॥ త్రి॥భూయాన్॥పు॥భూయసీ॥ స్త్రీ॥ భూయస్॥న॥

ఆద్యంఆదిభవేముఖ్యేభక్ష్యే
చాపిత్రిలింగకమ్।

ఆద్య- త్రి॥ఇది-ముందుపుట్టినవానికిని-ముఖ్యునికిని-
భక్ష్యవిశేషమునకును పేరు.

పూర్వేపాద్యావిధాత్రా
ద్యాఉత్తరేవాచ్యలింగకాః॥

ఆద్య- ఇది- బ్రహ్మ మొదలైన పూర్వికులకు పేరగు
నపుడు॥పు। ఈఆద్యశబ్దము ఉత్తరపదమైనపుడు విశేష్య
లింగము- ఉదాహరణము- ఇంద్రాద్యాఃదేవాః,శచ్యాద్యాః
స్త్రియఃఇత్యాదులు.

అర్థ్యోభవేదాత్మవతిప్రా
ర్థనీయార్థయుక్తయోః।

అర్థ్యః-పు॥ఇది- బుద్ధిమంతునికిని- ప్రార్థింపద
గినవానికిని- అర్థముతో గూడినవానికిని పేరు.

అర్ఘ్యాయల్లక్తైవార్ఘ్యాశ్చేప్య
ర్ఘ్యో

అర్ఘ్య-పు॥ఇది-పూజార్థమైయుంచినదానికిని-
పూజింపదగినదానికిని పేరు.

న్యోభిన్నతుల్యయోః॥

అన్య- పు॥ఇది-వేరయినదానికిని- సమానమైనదా
నికిని పేరు.

వామదక్షిణయోస్సవ్య

సవ్య- స్త్రీ॥ఇది-ఎడమప్రక్కకును- కుడిప్రక్కకును పేరు.

మంత్యోంత్యజ కనిష్ఠయోః।

అంత్య- పు॥ ఇది - అంత్యజాతికిని - కనిష్ఠునికిని
పేరు.

సభ్యస్సామాజికేసాధౌ

సభ్యః-పు॥ఇది- సభాజనమునకును- సజ్జనునకును పే॥

జాత్యశ్శ్రేష్ఠకులీనయోః॥

జాత్య పు॥ ఇది- శ్రేష్ఠునకును-సత్కులమునబుట్టిన
వానికిని పేరు.

లభ్యోయుక్తేశ్యాయలబ్ధవ్యో

లభ్య- పు॥ ఇది- న్యాయముతో గూడినదానికిని-
పొందదగినదానికిని పేరు.

నిత్యోసతత శాశ్వతౌ।

నిత్య-పు॥ ఇది- ఎడతెగనిదానికిని-నాశములేనివా
నికిని పేరు.

గర్హో-పియాన్యో

జ్యాయాంసో వృద్ధశ స్తవ
రాగ్రజాః॥ ౩౩౦॥

ఇతి యాంతాః.

కరోవర్షోపలే పాణౌశుం
డాయాంకిరణేబలౌ।

నరో మనుష్యార్జునయో
ర్భరో౽తిశయభారయోః॥

నాసావాయు ప్రాణిగవ
షడ్జోదాత్తాదయస్స్వరాః।

క్షురస్తు ఛేదనద్రవ్యే గోక్షు
రేకోకిలాక్షకే॥ ౩౩౧॥

చారస్స్యాత్ప్రియాళౌ చ

ఖురః కోలదళే శఫే।

వారస్సూర్యాదిదివసే బృం
దావసరయోరపి॥ ౩౩౩॥

భారో భరే వివధేఽ చపలా
నాంద్విసహస్రకే।

క్షారస్తులవణే కాచే రసభే
దే భస్మని॥ ౩౩౪॥

వృత్రో౽రిధ్వాంత దైత్యేషు

శక్రః కుటజవజ్రిణోః।

మంత్రో గూఢోక్తి వే
దాంశౌ

యూపాంశే కులిశే స్వరుః॥

కారుశ్శిల్పి విశ్వకర్మా
సురమారుతయోర్మరుత్
మరుర్ధన్వనిశైలే చ
స్థాలీహవ్యాన్నయోశ్చ
రుః॥ ౩౩౬॥

అద్రయో౽ద్రుమ శైలార్కాః

స్యాదంఘ్రిః పాదబుధ్న
యోః।

ఇంద్రః కాకాసురే౽పి॥ స్యా
జ్జయంతః జన యోరపి

జ్యాయస్-పు॥ ఇది-వృద్ధునికిని- ప్రశస్తునికిని- శ్రేష్ఠునకును-అన్నకును పేరు.

—✻ యాంతపదవర్గము ముగిసెను. ✻—

కర-పు॥ ఇది- వడిగండ్లకును- హస్తమునకును- ఏనుగుతొండమునకును- కల్పమునకును పేరు.

నర-పు॥ ఇది-మనుష్యునికిని- అర్జునునకును పేరు.

భర-పు॥ ఇది-అతిశయమునకును- భారమునకును పే॥

స్వర-పు॥ ఇది-ముక్కునబుట్టునూపిరికిని-జంతువుల ధ్వనికిని- షడ్జాదిస్వరములకును- ఉదాత్తాదులకును పేరు.

క్షుర-పు॥ ఇది- పిల్లకత్తికిని-పల్లేరుచెట్టునకును-గొలిమిడిచెట్టునకును పేరు.

చార-పు॥ ఇది- వేగువానికిని- మొరిటచెట్టునకును పేరు.

ఖుర-పు॥ ఇది-రేగాకునకును-పశువులగొరిసెకును పేరు.

వార-పు॥ ఇది- భానుసోమాదివారములకును- సమూహమునకును- అవసరమునకును పేరు.

భార-పు॥ ఇది- బరువునకును- కావడికిని- ౨౦౦౦పలములనెత్తునకును పేరు.

క్షార- పు॥ ఇది-ఉప్పునకును- గాజునకును- రసవిశేషమునకును-భస్మమునకును పేరు.

వృత్ర-పు॥ ఇది-శత్రువునకును- చీకటికిని-వృత్రాసురునకును పేరు.

శక్ర పు॥ ఇది-కొడిసెచెట్టునకును ఇంద్రునికిని పేరు.

మంత్ర-పు॥ ఇది-రహస్యాలోచనమునకును- గాయత్ర్యాదివేదమంత్రములకును పేరు.

స్వరు-పు॥ ఇది-యూపస్తంభఖండమునకును- వజ్రాయుధమునకును పేరు.

కారు-పు॥ ఇది-శిల్పికిని- విశ్వకర్మకును పేరు.

మరుత్-పు॥ ఇది-దేవతకును- వాయువునకును పేరు.

మరు-పు॥ ఇది-నిర్జలభూమికిని-పర్వతమునకును పే॥

చరు-పు॥ ఇది- స్థాలీపాకముచేసినహవిస్సునకును-అన్నమునకును పేరు.

అద్రి-పు॥ ఇది-వృక్షమునకును- పర్వతమునకును సూర్యునికిని పేరు.

అంఘ్రి- పు- ఇది- పాదమునకును- చెట్టుమొదటికని పేరు.

ఇంద్ర పు॥ ఇది-కాకాసురునకును జయంతునికిని. అర్జునునకును పేరు.

దంష్ట్రీ గ్రసదంష్ట్రీ గ్రాహి హా
హాశ్వాహా లే మూషికే కిటే।

దంష్ట్రి ౧న్-పు॥ ఇది- లతాకారముగా చుట్టుకొని ప్రాణిహింసచేయు పెద్దమత్స్యమునకును- సర్పమునకును- పెద్దపులికిని- పందికొక్కునకును- అడవిపందికిని పేరు.

చక్రీ విష్ణౌ కులాలే హా

చక్రిన్- పు-ఇది-విష్ణువునకును- కుమ్మరవానికిని సర్పమునకును పేరు.

పత్రీ శ్యేనేషు పక్షిషు।

పత్రిన్-పు। ఇది- డేగకును- బాణమునకును- పక్షికిని పేరు.

స్యమ్రాడగ్నీంద్ర విష్ణ్వర్కా
యశ్చ స్యాన్మండలేశ్వరః।
రాజసూయేన యే నేష్టం రా
జ్ఞాం శాస్తా స్యాజ్ఞయా చ యః॥

సంమ్రాజ్- పు॥ ఇది- అగ్నికిని-ఇంద్రునకును- విష్ణువునకును- సూర్యునికిని- మండలాధిపతికిని - రాజసూయయాగము చేసినవానికిని- ఆజ్ఞ తప్పక రాజ్యమునందలి యితర రాజుల శిక్షించు రాజునకును పేరు- సమ్యక్ రాజత ఇతి సమ్రాట్ ఇది జకారాంతము-

ఇంద్రావృషాశ్మ శక్రార్కాః

ఇంద్ర- పు॥ ఇది- ఇంద్రనీలమణికిని- ఇంద్రునికిని- సూర్యునికిని పేరు.

ఖరా రుద్రాగ్ని గర్దభాః।

ఖర-పు। ఇది-రుద్రునికిని- అగ్నికిని- గాడిదెకును పేరు.

పుండ్రో దేశేక్షు తిలక భేదే
క్రిమ్యతిముక్తయోః॥ ౨౮౦॥

పుండ్ర-పు॥ ఇది- దేశభేదమునకును - చెఱకుమొక్క విశేషమునకును- తిలకభేదమునకును - పురుగునకును- పువ్వులగురివిందకును పేరు.

ధారాపూః కాపి సేనాగ్రం ప
తదంబ్వాది సంతతిః। ఖడ్గా
దినిశిత ప్రాంతే తురంగిగతి
పంచకే। ౨౮౧॥

ధారా-స్త్రీ॥ ఇది- ధారానగరమునకును- సేనాముఖభాగమునకును- పడుచున్నయుదకాది ధారకును-ఖడ్గము మొదలైనయాయుధముల వాదరకును- గుఱ్ఱముయొక్క అస్కందిత ధౌరితక రేచిత వల్గిత ప్లుతములను పంచధారలకును పేరు.

ఇరా సురాం బువాగ్భూషు

ఇరా- స్త్రీ॥ ఇది-కల్లునకును- ఉదకమునకును - వాక్కునకును-భూమికిని పేరు.

ఋతువత్సరయోశ్శరత్

శరత్ - స్త్రీ-ఇది- శరదృతువునకును-సంవత్సరమునకును పేరు.

ఉపమాతా చ ధాత్రీ సా
క్ష్మామిరామలకీ చ సా॥

ధాత్రీ-స్త్రీ॥ ఇది-దాదికిని- భూమికిని- నెల్లిచెట్టునకును పేరు.

తరిర్దశాయాం నావి స్యా
ద్వస్త్రాదీనాంచ పేటికే।

తరి- స్త్రీ॥ఇది- బద్దెకును- ఓడకును- వస్త్రాదులనుంచు పెట్టెకును పేరు.

తంద్రీ తంద్రేత్యుభౌ శబ్దౌ
స్యాతాం నిద్రా ప్రమీలయోః

తంద్రీ*తంద్రా- స్త్రీ। ఈ రెండు శబ్దములును నిద్రకును ఒడలెరుంగకయుండుటకును పేరు.

వీరుధౌ గుల్మ గుల్మిన్యౌ

వీరుత్-స్త్రీ। ఇది- వేళ్లు మొదలుకొని యాకులు తరుచుగాగల చెట్టునకును- పొదలకును పేరు-కొమ్మలయందలి యాకులయొక్క సమూహముతోగూడిన ద్రాక్ష తాంబూలవల్ల్యాదులని యుంగొందఱందురు.

సిద్ధా స్త్రీనాచలే గిరిః।

గిరి- ఇది- మ్రింగుటకు చేరినపుడు। స్త్రీ। పర్వతమునకు పుంస్త్రీ॥

తత్రమూర్ధ్నార్పిణి ప్లవేదర్వ్యాం
యాత్రాగత్యాంచ యాప
నే॥ ౩౪౪॥
ద్వారంతుద్వార్యుపాయేచ
క్షీరంస్యాన్నీరదుగ్ధయోః।
అగ్రంపురశ్శిఖామానశ్రే
ష్ఠాధికఫలాదిషు। ౩౪౫॥

కృచ్ఛ్రంసాంతపనాదౌచ
కష్టేదుఃఖేనసోరపి।
నభస్స్వర్గాంబుదేష్వభ్రి

మురసీశ్రేష్ఠవక్షసీ॥ ౩౪౬
సరసీజలకాసారౌ
తరసీబలరంహసీ।

శిరఃప్రధానేసేనాగ్రే ద్రు
మాద్యగ్రేషుమస్తకే।
గాత్రం ప్రతీకేదంత్యగ్ర
జంఘాభాగేవపుష్యపి।
పత్రంపర్ణేవాహనేచ-ఛురి
కాగరుతోరపి॥ ౩౪౭॥
సీరసూకరవక్త్రాగ్రంపో
త్రం
పాత్రంతుభాజనే। తీరద్వ
యాంతరేయోగ్యే ద్రవిణే
రాజమంత్రిణి। ౩౪౮॥
సత్రంయజ్ఞేయజ్ఞభేదేస
దాదానేవనేంశుకే।

సూత్రంతుసూచనగ్రంథ
భేదేతంతువ్యవస్థయోః॥
నేత్రంవస్త్రేప్రణ్యాం వైశాఖ
గుణభూరుహమూలయోః।
క్షేత్రంభార్యాంగకేదార
పుణ్యభూగృహయోనిషు।
గ్రంథశాసనయోశ్శాస్త్రం

తర్పా-సీ॥ ఇది- దోనెకును-గరిటకును పేరు.

యాత్రా-సీ-ఇది-గమనమునకును- భోజనము మొదలగువర్తనలకును పేరు.

ద్వార- న॥ఇది-ద్వారమునకును- ఉపాయమునకును పేరు.

క్షీర- న॥ ఇది- ఉదకమునకును- పాలకును పేరు.

అగ్ర- న॥ఇది- ముందునకును-శిఖకును-మానమునకును- శ్రేష్ఠమునకును- అధిక ఫలమునకును- ఆదిశబ్దమువలన ౪ గార్త్రిసములప్రమాణముగలభిక్షకును పేరు.

కృచ్ఛ్ర-ఇది-సాంతపనము మొదలైనవ్రతములకును- కష్టమునకును- దుఃఖమునకును- పాపమునకును పేరు.

అభ్రి-న॥ ఇది- ఆకాశమునకును- స్వర్గమునకును- మేఘమునకును పేరు.

ఉరస్-న॥ఇది-శ్రేష్ఠునకును-రొమ్మునకును పేరు.

సరస్- న॥ఇది-ఉదకమునకును- కొలనికిని పేరు.

తరస్-న॥ ఇది-ప్రధానమునకును- సేనాగ్రమునకును వృక్షము మొదలయినవానితుదకును-శిరస్సునకును పేరు.

శిరస్-న॥ఇది. ప్రధానమునకును-సేనాగ్రమునకును-వృక్షము మొదలయినవానితుదకును- శిరస్సునకును పేరు.

గాత్ర-న॥ఇది-ఒడలికిని- ఏనుగుయొక్క ముందు మోకాలిక్రింది పక్కకును- అన్నునుగుశరీరమునకును పేరు.

పత్ర-న॥ఇది- ఆకునకును-వాహనమునకును- పిట్టకత్తికిని- ఱెక్కలకును పేరు॥

పోత్ర-న॥ఇది- నాగేటి మొనకును- పందిమూతికిని పేరు.

పాత్ర-న॥ఇది- భోజనపాత్రమునకును- నద్యాదుల యొక్క యిరుగడలనడిమికిని- యోగ్యునకును-ధనమునకును-రాజుయొక్క మంత్రికిని పేరు.

సత్ర-న॥ఇది-యజ్ఞసామాన్యమునకును- సత్రయాగమునకును-ఎడతెగని యీవినివనమునకును-వస్త్రమునకును పేరు.

సూత్ర- న॥ఇది-అర్థగౌరవముగలసూచనరూపమైన గ్రంథవిశేషమునకును-దారమునకును- మర్యాదకును పే॥

నేత్ర- న॥ఇది-వస్త్రమునకును- నేత్రమునకును- కవ్వపుత్రాటికిని- చెట్లయొక్క మొదటికిని పేరు.

క్షేత్ర-న॥ఇది-భార్యకును-ఒడలికిని- మడికిని- పుణ్యభూమికిని-గృహమునకును- యోనికిని పేరు.

శాస్త్ర-న॥యిది- తర్కవ్యాకరణాదిగ్రంథములకును-ఆజ్ఞకును పేరు.

